# నా యుద్యమపద్ధతి

శ్రీ వివేకానందస్వామి చెన్నపట్టణములో నొసఁగిన

ఉపన్యాసము






ప్రథమ ముద్రణము

శ్రీ రామకృష్ణ మఠము
మైలాపురము, మదరాసు.
వారిచే ప్రకటితము
1934

# నా యుద్యమపద్ధతి

శ్రీ వివేకానందస్వామి చెన్నపట్టణములో నిచ్చిన
యుపన్యాసమున కనువాదము

జన సమ్మర్దముచేత మొన్న నుపన్యాసము సాగలేదు కావున నేఁ డిచ్చట మన మెల్లరము మఱల సమావేశమైతిమి. చెన్నపురి పౌరులు నాయందు మొదటినుండియు నొక్కటే విధముగాఁ జూపిన దయకు వారికి నేను వందనము లర్పించుచున్నాను. చెన్నపురి పౌరులు నా కిచ్చిన యభినందనములందెల్ల నమృతోపమానములై యొప్పారు మృదు మధుర వాక్యములకు నే నెట్లు నా కృతజ్ఞతఁ గనఁబఱుపవలయునో యెఱుఁగఁజాలను. ఔదార్య ప్రేమలకుఁ దావలములైన యా వచనములకు నన్ను తగునట్లు చేయుమని భగవంతుని ప్రార్థించుటకంటె నా కృతజ్ఞత వెల్లడించుట కుత్తమమార్గము నాకుఁ గనఁబడుటలేదు. మన మతము నిమిత్తము, మాతృభూమి నిమిత్తము కృషిచేయుటకై నా జీవితమంతయు వినియోగించెదను గాక! దేవుఁడు నన్నందుల కర్హుని జేయుఁగాక! సహృదయులారా! నాయం దెన్ని దోషము లున్నను నాకుఁ గొంచెము ధైర్య మున్నదని తలఁచెదను. పవిత్ర చరితయగు భారతమాత పశ్చిమఖండమునకు విన్నవించుటకై నా కొక సందేశ మొసఁగినది. దానిని నేను నిర్భయముగా అమెరికా దేశస్థులకును ఆంగ్లేయులకును తెలిపితిని. నేఁటి యుపన్యాస

వఱకే ఒకఁడు మఱియొకనియందు సానుభూతి చూపును; ఇఁక నేక్షణములో నతఁడు భేదాభిప్రాయమునకుఁ బూనునో ఆ యుత్తర క్షణముననే ఆ సానుభూతియంతయు నెగిరిపోయి ఆ ప్రేమయంతయు మటు మాయమగును.

క్రైస్తనమత బోధకులు; బ్రాహ్మసమాజము.

ఇఁకఁ గేవలము స్వార్థపరాయణులు మఱికొందఱున్నారు. వీరి యాటలు సాగకుండ దేశములో నేయుద్యమమైనను బయలుదేఱి వారి నాటంకపఱచినయెడల అసహనముచేత వారి కడుపుమండి యెంతటి ద్వేషమునకైనను పూనుదురు; ఏమిచేయుటకును వారి కిఁకఁ దోఁచదు. హిందువులు తమయిండ్లను బాగుచేసికొనవలెనని ప్రయత్నించుచో క్రైస్తవమత ప్రచారకుల కేమి హాని కలిగినది ? హిందువులు తమ్ముఁ దాము శక్తికొలఁది సంస్కరించుకొనవలయునని యత్నము చేయుటవలన బ్రాహ్మసమాజమునకును తదితర సంస్కరణ సంఘములకును నేమి కీడు మూడినది? వారేల ఘోరశత్రువులవలె ప్రతిఘటించి నిలువవలెను? ఎందుకని నాప్రశ్న. వారిద్వేషమును, ఈర్ష్యయు నెందులకనిగాని, యేవిధముగాననికాని యడుగుటకు వీలులేనంత బిఱ్ఱబిగిసికొనిపోయి యున్నవని నాకుఁ దోఁచుచున్నది. నాలుగేండ్లవెనుక, చేత కాసైన లేక, పేరు ప్రతిష్ఠలు లేక, దిక్కుమాలిన సన్న్యాసినై యుండిన నేనమెరికాదేశమునకుఁ బోవుచు, పరిచయ లేఖలుగాని, స్నేహితులుగాని యాదేశమున లేనివాఁడనై దివ్యజ్ఞాన సమాజనాయకుని సాయము కోరితిని. అతఁ డమెరికా దేశస్థుఁడనియు, భారతదేశమునందుఁ

ప్రేమగలవాఁడనియు, నందుచేత నక్కడ నెవరితోనైనఁ బరిచయము కలిగించు లేఖ నొకదానిని నాకుఁ బ్రసాదించుననియు నే ననుకొంటిని. "నా సంఘములోఁ జేరెదవా?" యని నన్నతఁ డడిగెను. "వీలులేదు; మీ సిద్ధాంతములు చాల వానిలో నమ్మకములేని నేను మీ సంఘములోఁ జేరుట యెట్లు పొసఁగు" నని నేనంటిని. "ఐతే క్షమింపుఁడు; నేను మీ కేమియు సాయము చేయలేను" అని యతఁడు సమాధానము చెప్పెను. అదియేనా నాకు దారిచూపుట? ఇక్కడ నున్న దివ్యజ్ఞాన మతస్థులైన మిత్రులను దీనికి జవాబు చెప్పనిండు! నే నప్పుడు కొందఱు మదరాసు స్నేహితుల సాయమున అమెరికాకుఁ బోయిన సంగతి మీ రెఱిఁగినదే. నా కృతజ్ఞతకుఁ బాత్రులైన యొక్క న్యాయమూర్తి సుబ్రహ్మణ్య అయ్యరుగారు దక్క వారిలోఁ జాలమంది యిచ్చటనే యున్నారు. ప్రతిభను గుర్తింపఁగలిగిన వాఁడును, వాస్తవమైన స్నేహితుఁడును, భారతదేశమునకు నిజమైన పుత్రుఁడునునైన యాతఁడు నా ప్రియతమ స్నేహితులలో నొక్కఁడు. మత మహాసభ (Parliament of Religions) కొన్ని నెలల కారంభించుననఁగా నే నమెరికాచేరితిని. నాదగ్గఱనున్న కొంచెము సొమ్ము వ్యయమైపోయినది; చలికాలము సమీపించుటయు దానికిఁదోడు నాయొద్ద వేసవికాలమునకుఁ దగిన పలుచని యుడుపులు మాత్రమే యుండెను. ఉపద్రవకరమైన యీ చలికాలములో, ఆ శీతలదేశములో నేమి చేయుటకును నాకుఁ దోఁపలేదు. పోనిండు, వీధులవెంటఁబడి ముష్టియెత్తు కొనఁ బోవుదమన్నను అందులకు కారాగార ప్రాప్తియే ఫలి

తమై యుండెడిది. అప్పటికి నాయొద్ద కొన్ని 'డాలరులు' మాత్ర ముండినవి; వానితో వెంటనే యిక్కడ నా మిత్రుల కొక తంతివార్తఁ బంపితిని. ఈ సంగతి దివ్యజ్ఞాన మతస్థులకుఁ దెలిసి నా దుఃస్థితికి వారు బుజము లెగురవేసికొనుచు, "ఇప్పుడుగదా యీ పిశాచము చావఁబోవుచున్నది. దేవుఁడు మనల నందఱ నాశీర్వదించుఁగాక!" అని యానందించినారు. ఈ విధముగా నేనా నాకు దారిచూపుట? దివ్యజ్ఞాన మతస్థులైన మిత్రులను దీనికి జవాబుచెప్పనిండు. ఇదియంతయు నే నిప్పుడు చెప్పఁదలఁపక పోయినను నాదేశీయులు తెలిసికొనఁ గోరుటచేత దీనిని వెల్లడింపకఁ దీరినది కాదు. మూఁడు సంవత్సరములుగా ఈ సంగతులనుగూర్చి పెదవి మెదపిన వాఁడను కాను; మౌనమే నా తత్త్వముగాఁ బూనియుంటిని. కాని యీ దినమున విషయము పైకి రాక తప్పలేదు; అంతటితో సరికాదు. మతమహాసభలోఁ గొందఱు దివ్యజ్ఞానమతస్థులు నాకుఁ గనఁబడిరి; వారితోఁ గలసి మాటలాడవలె ననుకొంటిని. "దేవతల మధ్యమున ఈ కీటకమున కేమి పని?" యను విధమున వారి మొగములపైఁ దాండవమాడిన అసహ్యాకరమైన చూపులు నా కింకను జ్ఞాపకమున్నవి. అది కూడ నాకు దారిచూపుట కాకపోయినది; మఱికాదా?

మతమహాసభలో నా కృషినిగురించి కొంత గణన సంపాదించిన తరువాత నా కద్భుతమైన పని కలిగినది. కాని, యడుగడుగునకును దివ్యజ్ఞాన మతస్థులు మాత్రము నన్ను దిగఁద్రొక్కుటకే ప్రయత్నించిరి. దివ్యజ్ఞానమతస్థుల రహస్య శాఖ (Esoteric Section) యొక్క నిబంధనల ప్రకారము,

ఈ రహస్యశాఖలోఁ జేరినవారు 'కుతుమి, మోరియా' లను వారిదగ్గఱమాత్రమే జ్ఞానబోధ నొందవలయును. ఈ కుతుమి మోరియా లెవ్వరైనను సరియే. నా యుపన్యాసములను వినిన వారికి దివ్యజ్ఞాన సంఘమునందున్న సానుభూతియంతయుఁ జెడిపోవునను కారణమున నా యుపన్యాసములకు రాఁగూడ దనియు వినఁగూడదనియుఁ బ్రచారము జరిగినది. జడ్జి (Gudge) గారును, బిసెంటమ్మ (Besant) గారును వారి ప్రతినిధులలో మనకుఁ గానఁబడు వ్యక్తులు. అందుచే రహస్యశాఖలోఁ జేరుటయనఁగా వ్యక్తిగత స్వాతంత్ర్యమునకు నీళ్లు వదలుకొనుట యన్నమాట. నిజమునకు నేనట్టిపని చేయను; సరికదా, యెవ్వఁడైన నటువంటిపని చేసినయెడల వానిని నేను 'హిందు' వని పిలువఁజాలను. కీర్తిశేషులైన 'జడ్జి' గారి యందు నాకుఁ జాల గౌరవము. ధారాళమైనవాఁడును, న్యాయవంతుఁడును, నిరాడంబర స్వభావము కలవాఁడును, సత్పాత్రుఁడును నైన యాతఁడు దివ్యజ్ఞానమతస్థుల ప్రతినిధులలోకెల్ల నుత్తముఁడు. ఏమైన నాతనికిని బిసెంటమ్మగారికిని మధ్య నేర్పడిన వివాదమును గురించి నే నెట్టి పరిష్కారమును చేయఁజాలను. "నా మహాత్ముఁడు నాకుఁ దెలిపిన సందేశమే న్యాయసమ్మతమని" 'జడ్జి' గారును, "నా మహాత్ముఁడు నా కెఱిఁగించిన సందేశమే న్యాయముద్రితమ"ని బిసెంటమ్మ గారును వివాదపడుచుండుట యట్లుండ, ఈ కథ యంతటి యందును గల విచిత్రాంశమేమనఁగా నిరువురు నొకే మహాత్మునిగురించి "నావాఁడన, నావాఁడ"ని పెనగులాడినారు. నిజము దేవునికెఱుక! ఆతఁ డొక్కఁడే న్యాయమూర్తి! ఇరు

వైపులను సమభారముగలిగి తూఁగుచున్న త్రాసునం దొక భాగమునుగూర్చి తీర్పుచెప్పుటకు మఱెవ్వరికిఁగాని యధికారములేదు.

ఏది యెట్లున్నను, అమెరికాదేశమందంతటను నా కార్యక్రమమునకు వారు సాయముచేసిన దీవిధముగానే! ద్వితీయ ప్రతిపక్షములోఁ జేరిన క్రైస్తవమత ప్రచారకులతోఁ గూడి, వారు నాపై మోపని యపనింద యొక్కటియైన లేదు. దరిద్రుఁడనై, మిత్రులులేక పరదేశములో నేను ప్రవాసము చేయుచుండ, నగర నగరమునందును నా నడవడికపై నపనిందలు మోపినారు. ఇంటింటినుండి నన్ను వెడలఁగొట్టుటకు, స్నేహితుఁడైన వాని నెల్ల నా విరోధియగునట్లు చేయుటకు వారు ప్రయత్నించిరి. తిన తిండిలేక నన్ను మాడ్చి వేయవలయునని వారు సల్పిన యత్నములతో నా దేశీయులలోనివాఁడేయైన యొకఁడు చేరెనని చెప్పుట నాకు విచారకరము. అతఁడు భారతదేశములో సంస్కరణ పక్షమునకు నాయకుఁడు. నా ప్రతివాక్యము. నిప్పుడు నా యొద్దనున్న సాక్ష్యములతో ఋజువుపఱచుటకు సంసిద్ధుఁడను. నేను సూచించిన పెద్దమనుష్యుఁడు దినదినము "హిందూదేశమునకు క్రైస్తువచ్చియున్నాఁడ"ని వక్కాణించుచున్నాఁడు. "భారతదేశమునకు క్రైస్తు వచ్చు మార్గ మిదియేనా?" యని నే నాతని నడుగుచున్నాను. ఇదియేనా హిందూదేశమును సంస్కరించుపద్ధతి? మఱి, యీ పెద్దమనుష్యుని నా బాల్యమునుండి నే నెఱుఁగుదును. ఇతఁడు నా ముఖ్యస్నేహితులలో నొకఁడు. చాలకాలమునుండి నా దేశీయులలో నొక్కరినైనఁ

గలసికొనఁజాలని నే నీతనిజూచి సంతసించుచుండఁగా నా కాతఁడు చేసిన సత్కారమిది!

ఏనాఁడు మహాసభ నా కుత్సాహము గల్గించెనో, యే నాఁటినుండి షికాగో నగరములో జనపరిచయము నాకు లభించెనో యానాఁటినుండియే వాని భావము మాఱిపోయి యాతఁడు నాకు హానిచేయుటకుఁ దనచేత నైనంతవఱకు శక్తివంచన లేక పాటుపడియున్నాఁడు. క్రైస్తు హిందూదేశమునకు వచ్చు మార్గ మిదియేనా? క్రైస్తవమతమును క్రైస్తవశక్తియు భారతదేశము నుద్ధరింపఁ బోవుచున్నవని మన పెద్ద పెద్ద సంస్కర్తలు నొక్కి చెప్పుచున్నారు. అందుల కిదియే విధానము కాఁబోలును! ఆ పెద్ద మనుష్యుఁడే యిందుకు నిదర్శనమైనయెడల నిజమునకు నాకంతఁగా ఆశ కనఁబడుటలేదు.

మఱియొకమాట—విజ్ఞానవంతులైన యీ సంస్కర్తల పత్రికలో నేనొక శూద్రుఁడననియు శూద్రుఁడు సన్యాసము తీసికొనుట కేమి 'హక్కు' గలదని నన్ను సవాలు (Challenge) చేయుచున్నట్లును చదివితిని. దానికి నా జవాబిది. నే నొక శూద్రుఁడనైనచో—ఆ పత్రికా ప్రకాశకుని కులము ఛండాలకులము! ఇదియే నా సమాధానము! 'యమాయ ధర్మరాజాయ చిత్రగుప్తాయ వైనమః'—అనఁగా నెవఁడు ప్రతి వ్యక్తియొక్క మంచి పనులను చెడ్డ పనులను కూడ వ్రాసియుంచునో, క్షత్రియు లెవని పరంపరలోనివారో, యెవఁడు సమస్త ధర్మములకును ప్రభువో అట్టి యమునకు నేను వంగి నమస్కరించుచున్నానను మాటలతో నెవరి పాదములకు నిత్యము ప్రతి బ్రాహ్మణుఁడును మ్రొక్కునో

అట్టి యమధర్మరాజు పారంపర్యములోనివాఁడను నే నని చూపెదను. మీ పురాణములందు, మీ పౌరాణిక గ్రంథములందు మీకు నమ్మకమున్నయెడల, నా జాతివారు పూర్వము చేసిన యితర ఘనకార్యములమాటయటుండ, శతాబ్దముల తరబడిని సగము హిందూదేశము నేలినది నా జాతియని ఈ బంగాళాదేశపు సంస్కర్తలు తెలిసికొందురుగాక ! నా జాతిని విడిచినచో నేటి భారత నాగరకత యెక్కడ మిగిలియుండఁ గలదు ? ఒక్క బంగాళాదేశమును తీసికొని చూచినప్పటికిని, మహా వేదాంతిని, మహాకవిని, మహా చిత్రకారుని, మహా శిల్పకారుని, మహా మతబోధకులను వారికిచ్చినది నా జాతి రక్తము. భారతదేశములోనున్న యాధునిక శాస్త్రజ్ఞులలో మహా మహులను కలుగఁజేసినది నాజాతి రక్తము. నాది శూద్రజాతియఁట ! ఐన, ఈ పత్రికా ప్రకాశకుఁడు ఛండాలుఁడని నేను తిరిగి చెప్పుచున్నాను. ఇతఁడు మనయొక్క చరిత్రను కొంచెము తెలిసికొని మూడు జాతులను గురించి కొంచెము గ్రహించి, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు సన్యాస స్వీకరణాధికారము కలదని, త్రైవర్ణికులకు వేదములయందు సమానాధికారము కలదని యెఱిగియుండిన బాగుండెడిది. ఇవి నేను ప్రస్తావనవశమునఁ జెప్పెడి మాటలు. ఈ సంగతి నేను కేవలము సూచించుచున్నాను కాని నన్ను వారు శూద్రుఁడని పిలచినను నా కేమియు బాధలేదు. బీదజనులపై నా పూర్వులు చూపిన క్రౌర్యమున కిదియొక అల్ప ప్రాయశ్చిత్తము, నేను మాలవాఁడనైన నాకు మఱింత సంతోషము. ఏలన, పంచముని గృహము నూడ్చ సిద్ధపడిన బ్రాహ్మణ

శ్రేష్ఠుఁడగు మహాత్ముని శిష్యుఁడను నేను. ఔను, నిజమున కా కడజాతివాఁ డంపులకు సమ్మతింపఁడు గదా! బ్రాహ్మణ సన్యాసిని తనయింటి నె ట్లాతఁడు తుడువనిచ్చును ? కాఁబట్టి యీ బ్రాహ్మణసన్యాసి నిశిరాత్రిని మేలుకొని రహస్యముగ ఆ మాలవానియింటిలోఁ బ్రవేశించి తన దీర్ఘశిరోజములు చీపురుచేసి పంచముని పాకిదొడ్డి తుడిచినాఁడు. తా నందఱకు సేవకుఁడగుట కతఁ డిట్లెన్నియోసారులు చేసియున్నాఁడు. ఆ మహాపురుషుని పాదధూళి నాశిరమునఁ దాల్చెదను. అతఁడే నా వీరుఁడు. నే నావీరుని జీవిత మనుకరించుటకై ప్రయత్నించెదను. ఇట్లే నిజమగు హిందువు మిమ్ముద్ధరింప యత్నించును. దరిద్రసోదరులగు భారతీయుల నుద్ధరించు టిట్లే. ఇది పరజాతి ప్రోత్సాహమువలనఁ గాదు. తన మిత్రుఁడు జనహితుఁడై నాఁడనియుఁ, దాను డబ్బు గడించుకొనుట కీ మనుష్యుఁ డాటంకము కలుగఁజేయుననియుఁ దలఁచి అన్యదేశములోఁ దన స్నేహితుని తిన తిండిలేక మాడ్చివేయవలెనని కోరుచున్న యీ మనుష్యుని దృష్టాంతము నిరువదియేండ్ల నుండి వచ్చుచున్న పాశ్చాత్య నాగరకత మనకుఁ దీసికొని వచ్చినది. ఇఁక రెండవదో యందురా, నిజమైన సనాతన హిందూమతమున స్వదేశము దన బిడ్డల కేమి చేయఁగలిగినదియుఁ దెలిసికొనుటకు నిదర్శనము. మన సంస్కర్తలలో నొక్కొక్కఁడును సమస్తజనులకు సేవచేయుటకును పంచమునియింటిని సైతము తుడిచి శుభ్రముచేయుటకును సంసిద్ధముకానిండు. అప్పుడు నే నట్టి వాని పాదముల నాశ్రయించి

నేర్చుకొందును. అంతకుముందు కాదు. కొండంత పెద్ద కబురు లణువంత యనుభవమునకు సాటిరావు.

సంఘ సంస్కరణ సంఘములను గురించి విమర్శనము.

ఇఁక మదరాసులోని సంస్కరణ సంఘములకు వచ్చెదను. అవి నన్ను చాల దయతోఁ జూచినవి. దయాపూర్వకమైన మాటలతో నా కవి యథార్థము కనఁబఱచినందులకు వానితో నేను మనఃపూర్వకముగా నేకీభవించి బంగాళాదేశపు సంస్కర్తలకును మదరాసు సంస్కర్తలకు నంతర వున్నదని యంగీకరించెదను.మదరాసు యిప్పుడున్న స్థితికిని బంగాళాదేశమున్న స్థితికిని తారతమ్య మున్నదనిమీతో నేను తఱచు చెప్పుచుండినది మీలోఁ జాలమందికి జ్ఞప్తియందుండ వచ్చును. సంస్కరణమున మదరాసు పరస్పర కలహములకుఁ గాలుదువ్వు వంగదేశస్థితిలోని కింకనుదిగలేదు.

ప్రశాంతమై సర్వదా నిశ్చలమైన పురోవృద్ధిగలిగి, ప్రతిక్రియలోఁగాక పరివర్తనములో నిచ్చట వికాసముకలదు. ఐనను కొన్నియేండ్లక్రిందటఁ దప్పుగానెంచి విడిచిపెట్టిన యాచారవ్యవహారములు కొంతవఱకు వంగదేశములోఁ బునః ప్రతిష్ఠనొందుచున్నవి. కాని మదరాసులో ప్రతియొక సంస్కరణమందు నభివృద్ధి—సహజమైన యభివృద్ధి—కొంతవఱకుఁ గలిగినది. అందుచే మదరాసు సంస్కరణ సంఘము లీ రెండు రాష్ట్రముల సంస్కరణములందుఁ గల భేదమని చూపుచున్న విషయమును సంపూర్ణముగా నే నంగీకరించెదను. కాని యీ సంఘముల కర్థముకాని సంగతి యొకటి కలదు. వీనిలోఁ గొన్ని నన్ను తమతోఁ జేరుమని బలాత్కరించుటఁ జూడ

నాకు భయమగుచున్నది. అవి యట్లు ప్రయత్నించుట విచిత్ర మైన విషయము. తన జీవితములో పదునాలుగేండ్ల పర్యంత మెప్పటి కష్ట డన్నము లేక క్రుంగిపోవుచు, మఱునటి దిన మేమి తినవలసియుండునో, యెచ్చట నిద్రపోవలసి యుండునో తెలియరాక గడపిన మనుష్యు డంత సులభముగా బలా త్కారమునకు వశుఁడై పోనేరఁడు. కొంచె మించుమించుగా, గట్ట బట్టలేక, ఆ పూట కాపూట యన్న మెక్కడనుండి వచ్చునో యెఱుకపడక, ఉష్ణమాపకము నిండుసున్న దాటి ముప్పదియంశములు క్రిందికి దిగిన మంచుదిబ్బలలో నివసించు టకు సాహసించిన మానవుఁ డంత సులభముగా భారతదేశ మున బలాత్కారమునకు వశుఁడై పోవునా? నేనీ సంఘము లకుఁ జెప్పు మొదటి యంశమిది. నాకొక కొంచెము స్వతంత్ర బుద్ధి యున్నది; స్వల్పానుభవము కూడ కలదు. మఱియు, నాకుఁ బ్రపంచమున కీయవలసిన సందేశ మొకటి యున్నది. ముందేమి జరుగునో యని యాందోళన పడక, నిర్భయముగా దానిని నేను ప్రపంచమున కిచ్చెదను. ఈ సంస్కర్త లిక్కడ నొక కొంచెము, అక్కడ నొక కొంచెము సంస్కరింపఁ దలఁచుచుండ, నేను మూలమట్టమునకుఁ, బునాదులవఱకుఁ, గూకటి వ్రేళ్లపర్యంతము సంస్కరింపఁ గోరెదను. అందుచేత వా రందఱికంటె పెద్ద సంస్కర్తనని నేను వారికిఁ జూపెదను. మాకుఁగల భేదమెల్ల విధానములో మాత్రమే. వారిది నిర్మూలన విధానము; నాది నిర్మాణవిధానము. సంస్క రణములో నాకు నమ్మకములేదు. అభివృద్ధి

నిర్మాణమే నిజ మైన సంస్కరణ విధానము; నిర్మూ లనము కాదు.

యందే నాకు నమ్మకము. "మీపోకడ లీరీతిగా నుండవలెను; ఆరీతిగా నుండఁగూడదు;" అని మనసంఘమున కీశ్వరునివలె నే నాజ్ఞాపించుటకు సాహసింపను. శ్రీరాముఁడు సేతువు గట్టు నప్పుడు కేవలము తనవంతునకు వచ్చిన యిసుక రేణువులను సేతువుపైఁ బోసిన యుడుతవలె నమ్రతతో నా కార్యమును నేను చేయఁగోరెదను. నాపద్ధతియిది. అద్భుతమైన యీ జాతీయ యంత్రము యుగములవెంబడిని పనిచేసినది. జాతీయ జీవితమను నద్భుతమైన యీనది మనయెదుట యుగము లాదిగ పాఱుచున్నది. 'అది మంచిదేనా?' అని యడుగుటకు సాహసించువారును తెలిసికొనువారును యెవ్వరు? అది యిట్లే నడువవలయునని యాజ్ఞాపించుశక్తి యెవరికిఁగలదు? దానికిఁ బ్రత్యేకమైన యావేశము గలిగించుచు, కొన్నివేళలయందు మాంద్యమును కొన్నిసమయములలోఁ జుఱుకుతనమును కలిగించి నడిపించుచున్న వేలకొలఁది పరిస్థితులు దానిచుట్టును చేరుచున్నవి. దానిగతి నడ్డగించుట కెవరు సాహసింపఁగలరు?

దోషము లన్ని చోట్లనున్నవి.

గీత చెప్పినట్లు, పనిచేయుట; సంతృప్తిపడి యుండుట; ఇదియే మనవంతు. మనము దానికిఁ గావలసిన కట్టెలువైచి ప్రజ్వలింపఁ జేయఁ గలుగుదుమేకాని వృద్ధిచెందుట దానివంతు మాత్రమే. దాని నెవ్వరును శాసింపనేరరు. మన సంఘములో దోషములు చాలఁగలవు. అట్లే, మిగిలిన యన్ని సంఘములందు నున్నవి. వితంతువులు కొన్ని సమయములం దిక్కడ నేలను తమ కన్నీళ్లచేఁ దడుపుచుండఁ, బెండ్లికానికన్యలు తమ

హాహాకారములచేఁ బశ్చిమదేశములో గాలిని విషమయము చేయుచున్నారు. బ్రదుకుటకు లేమి యిక్కడ గొప్ప యుపద్రవ ముగానుండ భోగముచేఁ గలిగిన బడలిక యచ్చట నుపద్రవ ముగా నున్నది. మనుష్యు లిక్కడ దినుట కేమియు లేక పోవుటచే నాత్మహత్య చేసికొనుచున్నారు. తిండి యెక్కుడై అక్కడ వా రాత్మహత్య చేసికొనుచున్నారు. జీర్ణించిన కీళ్ళ నొప్పి జబ్బువలె అన్నిచోట్లను దోషమున్నది. పాదములనుండి దానిని తరిమిన నెత్తికెక్కును; అక్కడనుండి తరిమిన, మఱి యొకచోటికిఁ బోవును. ఒకచోటనుండి మఱియొకచోటికి దానిని వెంటాడుట యన్నమాట. అంతకంటె మఱేమియుఁ గాదు. ఆహా! తాము చూపినదే నిజమైన త్రోవయని, లోక ములోనున్న చెడుగును 'మేము కుదుర్చఁగలమ'ని పసిబిడ్డలు మాత్రమే యనుకొందురు! మంచిచెడ్డ లెప్పుడును కలసియే యుండుననని, ఒకే నాణెమునకవి 'బొమ్మ, బొరుసు' వంటి వని మన వేదాంతముయొక్క బోధ. వీనిలో నీ కొకటి యుండిన, రెండవదికూడ నుండి తీరవలసినదే. సముద్రములో నొకచోట కెరటము బయలుదేఱినట్లైన దానికిఁ బ్రతిఫల ముగా నెక్కడనో యక్కడ 'ఖాళీ' యైన దన్నమాటయే. అంతవఱ కెందులకు? బ్రదుకంతయుఁ జెడుగే. ఏదో యొక జీవిని చంపనిదే ఒక్కయూపిరిగూడ పీల్చలేము. మన మొక ముద్ద యన్నము తిన్నచో, వేఱొకరికి లేకుండఁజేసితిమన్న మాట! ఇదియే లోకధర్మము; ఇదియే తత్త్వము. కాఁబట్టి మన మెంతపెద్ద కబురులు చెప్పినను లోకములోనున్న చెడుగు నెదుర్కొనుటకు మనము చేయుచున్న కృషి యంతయు విశే

షముగా స్వకీయమనియుఁ బరకీయముకాదనియు నెఱుంగవలెను. ఔను, చెడ్డ నెదుర్కొనుటకుఁ జేయుకృషినిగురించి మనము మొట్టమొదట అనుభవమునకుఁ దెచ్చుకొనవలసిన యభిప్రాయ మిదియే. ఇదియే మనకు నెమ్మది గలిగించి మన నెత్తురునుండి వెఱ్ఱిపట్టుదల నీవలకు లాగివేయఁగలదు. ఏమనఁ బిచ్చిపట్టుదలతోఁ గూడిన సంస్కరణము లెక్కడెక్కడ జరిగినవో యక్కడ నెల్ల దానికి జవాబుదారులైన వారు తమకుఁ దామే శత్రువులైరని ప్రపంచచరిత్ర మనకు బోధించుచున్నది.

*లోకములోనున్న చెడుగు నెదుర్కొనుటకై మనము చేయుకృషి మనకు సంబంధించినంత, ప్రపంచమునకు సంబంధింపదు.*

న్యాయమును స్వాతంత్ర్యమును స్థాపించుటకు 'అమెరికా' దేశములో బానిసత్వ నిర్మూలనమునకై చేసిన యుద్ధమునకంటె గొప్ప యుద్ధారణోద్యమము కనజాలము; వినజాలము. మీకందఱకు దానినిగూర్చి తెలిసియేయున్నది. మఱి, దానిపర్యవసానమేమైనది? బానిసత్వ నిర్మూలనమునకుఁ బూర్వమునకంటె వర్తమానమున బానిసలు నూఱుఱెట్లు నీచమైన స్థితిలోనున్నారు. నిర్మూలనమునకు ముందీ నీగ్రో లొకరిసొత్తుగ నుండిరి; కాన వారింకను నైచ్యస్థితికిఁ బాలుగాకుండ వారి యజమానులు చూచుకొనుచుండిరి. ఇప్పుడో, వా రెవ్వరికిని చెందినవారు కారు. వారి బ్రదుకులు లెక్కపత్రములేని దిక్కుమాలిన బ్రదుకులై పోయినవి. ఏదో యొక మిష పెట్టి బ్రదికియుండఁగనే వారిని నిప్పులలోవైచి కాల్చుచున్నారు; తుపాకులతోఁ

*నిర్బంధ సంస్కరణముల విమర్శనము.*

ప్రేల్చుచున్నారు. వారిని చంపినవారి కే శాసనమును లేదు. ఎందులకు ? పాపము, వారు నల్లజాతివారు. వారు మాన వులుకారు ; జంతువులుకూడ కారు. మఱి, శాసనమువలనఁ గాని, పట్టుదలవలనఁగాని యీరీతిని బలాత్కారముగాఁ జెడు గును తీసివేయుటచేఁ గలుగు ఫలితమిది. పట్టుదలతోఁ గూ డిన ప్రతి యుద్యమమును గురించియు, మంచి చేయవలెనను సంకల్పముతోఁ జేసినను, అట్టివానిని నిరసించుచుఁ జరిత్ర మనకిచ్చు నభిప్రాయమిది. ప్రత్యక్షముగా నేను దానిని జూచినాను. స్వానుభవము దానిని నాకు నేర్పినది. కాఁబట్టి యీ నిరసనసంఘములలో దేనియందును నేను జేరను. నిరసన మెందులకు ? ప్రతి సంఘమునందును చెడుగులున్నవి. ఆ సంగతి యెల్లరకుఁ దెలిసినదే. ముక్కుపచ్చలారని ప్రతి పసిబిడ్డకూడ, నేఁ డుపన్యాసవేదికమీఁద నిలువఁబడి హిందూ సంఘమునందలి చెడుగులను గురించి గంభీరోపన్యాసము చేయఁగలదు. భూగోళము ద్రొక్కుకొనుచు వచ్చి, యిప్పు డుండి యుత్తరక్షణములో మాయమగు 'రైలుబండి' దృక్పథముతో భారతదేశమును చూచిపోవు నిరక్షర కుక్షియగు ప్రతి విదేశీయుఁడును భారతదేశమందలి భయంకరమైన చెడుగులను గురించి విజ్ఞానశిఖామణివలె నుపన్యసించును. దానిని మనము కాదనము. దోష మెక్కడనున్నదో ప్రతి మనుష్యుఁడును చూపింపఁగలఁడు. కాని, యున్న చిక్కునుండి తప్పించుకొను నుపాయ మెవఁడు కనిపెట్టునో అట్టివాఁడే మానవజాతికి మిత్రుఁడు. "మొదట నీటినుండి నన్ను పైకిఁ తీయుము," అని మునిఁగిపోవుచున్న పిల్లవాఁడు తనకుపన్యా

సము చేయుచున్న వేదాంతితో మొఱవెట్టిన విధముగా, "మేము కావలసినన్ని యుపన్యాసములను వినియున్నాము; కావలసినన్ని సంఘము లున్నవి. మమ్ములను బైటికిఁ దీయుటకుఁ జేయూతనిచ్చు మనుష్యుఁ డెక్క డనున్నాఁడు? మమ్ములను నిజముగాఁ బ్రేమించువాఁడేడి? మాయందు సానుభూతిగల మానవుఁడెక్కడ?" అని మన జనులు విలపించుచున్నారు. ఔను; అట్టి మనుష్యుఁడే కావలసియున్నాఁడు. అందుచేతనే యీ సంస్కరణోద్యమముల పద్ధతులతోఁ బూర్తిగా నేను వ్యతిరేకించుచున్నాను. ఈ యుద్యమములు నూఱేండ్లుగా నిక్కడ నున్నవి. ఎంతసేపు నింద, తిరస్కారము—వీనితో నిండిన వాఙ్మయముదక్క, వానివలన మఱేమి మంచి కలిగినది? భగవంతుని దయవలన నట్టి సంస్కరణా మిక్కడ లేకపోయిన నెంతయో బాగుండెడిది. సనాతనులు సంస్కర్తల పద్ధతినే యవలంబించి వారి కఱ్ఱతో వారినే కొట్టువఱకీ సంస్కర్తలు సనాతనుల పద్ధతులను విమర్శనము చేసి, తిరస్కరించి, దూషించియున్నారు. జాతికిని దేశమునకును సిగ్గగునట్టి వాఙ్మయము భరతఖండమునందలి ప్రతి దేశభాషయందు నుత్పన్నమగుటయే మఱి దీనికిఁ బర్యవసానమైనది. సంస్కరణమనగా నిదియేనా? ఇదియేనా జాతి నున్నత స్థితికిఁ దీసికొనుపోవు పద్ధతి? ఎవరి దీ తప్పు?

సానుభూతియే సంస్కరణమునకు నిజమైన పద్ధతి.

ఇది యిట్లుండనిండు. బాగుగా నాలోచింపవలసిన విషయము మఱియొకటి కలదు. ఇక్కడ మన భారతదేశములో రాజులు మనలను సర్వదా పరిపాలించియున్నారు. మన శాస

వకర్త లందఱు రాజులు. ఇప్పుడో, రాజులు గతించినారు; పూర్వమువలె జనులను ముందునకుఁ దీసికొనిపోవు వా రెవ్వరును లేరు. ప్రభుత్వ మిందులకు సాహసింపదు; జనాభిప్రాయము ననుసరించి ప్రభుత్వము తన త్రోవలను దిద్దుకొనవలసినదిగా నున్నది. దృఢమై, క్షేమ కరమైన జనాభిప్రాయమును కలిగించి దానిమూలమున సంఘము తన సమస్యలను తానే పరిష్కరించుకొనవలయునన్న నింకను చాలకాలము పట్టును. అంతవఱకు మనము కనిపెట్టుకొని యుండవలసి యుండును. కాఁబట్టి సంఘసంస్కరణ సమస్య యంతయు, “సంస్కరణము కావలసినవా రెక్కడ? జను లెక్కడ?” అను ప్రశ్నలో నిముడుచున్నది. మొదట జనులను సంస్కరణమున కాయత్తము చేయవలెను. లేనియెడల నింద్యమై, స్వల్పసంఖ్యగల నిరంకుశప్రభుత్వము వచ్చి తీరును. ఎవరో కొందఱు కొన్ని యంశములు చెడ్డవని యనుకొని నంతమాత్రమున సంఘము ముందునకుఁ బోనేరదు. కావుననే హైందవ జాతి చలనములేక వెనుకఁబడుచున్నది. మొదట జాతికి విద్య నొసఁగి మీ శాసనా సభానిర్మాణము చేయుఁడు; అప్పుడు

ప్రజాభిప్రాయమను (క్రొత్త) యంగీకారమును విద్యవలనఁ గలిగింపవలసి యున్నది.

చట్టము బయలుదేఱఁగలదు. మొదట శక్తిని గలిగించిన, ఆశక్తియే శాసనమును వెలువరింపఁగలదు. రాజు లస్తమించినారు. తన యంగీకారము నీయఁగలిగిన ప్రజాభిప్రాయమను క్రొత్తశక్తి యేది? దాని నీవలకుఁ దీసికొనిరండు. కాఁబట్టి సంఘ సంస్కరణమునకైనను, ప్రజలను విద్యావంతులను

జేయుట మొదటివిధి ; అట్టి సమయము వచ్చు పర్యంతము మీరు నిరీక్షించుకొని యుండవలసినదే. గతించిన నూతేం డ్లుగాఁ బ్రయత్నించి చూచిన వానిలో నెక్కువ సంఖ్యగల సంస్కరణములు కేవల మలంకార భూయిష్ఠములు. ఈ సంస్కరణములలో నొక్కొక్కటియు మొదటి రెండు జాతులకు మాత్రమే సంబంధించినది. మిగిలిన జాతులకును ఆ సంస్కరణములకు నే సంబంధమును లేదు. ఇందుల కొక యుదాహరణము.—వితంతు వివాహ సమస్య హైందవ స్త్రీలలో నూటికి డెబ్బదిమందికి సంబంధింపదు. జనసామాన్యమును త్రోసివైచి తాము విద్యావంతులైన యగ్రజాతి హిందువులకు మాత్రమే—యీ సమస్య లన్నియు సంబంధించి యున్నవి. ఇది బాగుగా గమనింపవలసిన విషయము. ఎంతసేపు, తమ యిండ్లనుమాత్రమే చక్కఁబెట్టుకొనుచు, తమ సొగసునే దిద్దుకొనుచు, విదేశీయులయెదుట తాముమాత్రమే యందముగాఁ గనఁబడుటకు వారు తమ శక్తినంతయు వినియోగించినారు. అదికాదు సంస్కరణము. వస్తువుయొక్క మూలములవఱకును వ్రేళ్లవఱకును మీరు క్రిందికిఁ బోవలసియున్నది. అట్టిదే నేను చెప్పు కూలంకష సంస్కరణము ; ఆమూలశాఖాపర్యంతమైన సంస్కరణము. నిప్పు నక్కడనుంచి జ్వాలలు పైకి పోవునట్లు మండనీయుఁడు. మఱి, యీరీతిని సంయుక్తమైన భారతదేశము (United India) ను నిర్మాణము చేయుఁడు. ఈ సమస్య యంతగా సులభమైనది కాదు. ఇది మన ముందున్న మహాసమస్య. తొందరపడవలదు.—నా మాటలను గుర్తింపుఁడు—శతాబ్దములుగా ఈ సమస్య

యిచ్చటనున్నది. నేఁడు, ముఖ్యముగా ఈ ప్రాంతములందు బౌద్ధమతమునుగురించి, దానిలోనున్న నాస్తికతనుగూర్చి, గొప్పగాఁ జెప్పు టొక యాచారముగానున్నది. ఈనాటి యీ అధఃపతనమునకు బౌద్ధమతమునుండి కాలక్రమమున బయలు వెడలిన శాఖలే కారణమని, పాపము, వారి కణుమాత్రమును తెలియదు.

బౌద్ధమత మవలంబించిన సంస్కరణ విధానములోనున్న లోపము.

బౌద్ధమతము మన చేతులలో నుంచిన పిత్రార్జితమిది. గౌతమబుద్ధుని యద్భుతమైన నీతిమూలమున, అద్భుతమైన యతని వ్యక్తిప్రభావము (Personality) చే బౌద్ధమతము వ్యాపించినదని, బౌద్ధమత వృద్ధి క్షయములను పరిశీలించి చదువని వారు వ్రాసిన పుస్తకములలో మీరు చదువుచుందురు. బుద్ధ భగవానునియందు నాకుఁ జాల గౌరవము. కాని,—నామాటలను గమనింతురు గాక—ఆ మహాప్రభుని సిద్ధాంతములకంటె, వ్యక్తిప్రభావము కంటె, దేశములోఁ గట్టిన దేవాలయములును, ప్రతిష్ఠించిన విగ్రహములును బుద్ధుని నిర్యాణమునకుఁ జాలకాలము తరువాత బౌద్ధమతము భారతజాతి యెదుటఁ బ్రదర్శించిన బ్రహ్మాండమైన యుత్సవములును, బౌద్ధమత వ్యాప్తికిఁ బ్రబలతర కారణములై యున్నవి. బౌద్ధమత మీ విధముగా వృద్ధిపొందినది. బ్రహ్మాండమైన యీ యాలయముల యెదుట, ఉత్సవముల యెదుట జనులు తమయిండ్లలో హవిస్సులను వ్రేల్చుకొను చిన్న చిన్న వైదిక హోమగుండములు (Fire Places) ఎట్టులైనను నిలువఁబెట్టుకొనవలసినంత రమణీయముగా నుం

డకపోవుటచేత వాని స్థానము నివి యాక్రమించినవి ; జను
బౌద్ధులైనారు. కాని, కాలము గడచినకొలఁది అదియంతయు
క్షీణించి, యీ సభాసదులముందు దానినిగూర్చి నేను చెప్ప
లేనంతటి యసహ్యాకరమైన వస్తుజాలము క్రిందికి దిగిపోయి
నది. ఐనను దీనినిగురించి తెలిసికొనఁదలఁచినవారికి దక్షిణ
హిందూదేశములోనున్న పెద్దపెద్ద దేవాలయములమీఁది

జనసామాన్యాభిప్రాయముల సక్రమ పరిణామమే సంస్కరణమునకు సరియైన మార్గము.

బొమ్మలే సాక్ష్యము. తరువాత వచ్చిన
బౌద్ధులనుండి మనకు లభించిన పిత్రార్జిత
మీరీతిగా నున్నది. అప్పుడు మహా సంస్క
ర్తలైన శంకారాచార్యులును, నతని యను
యాయులును బయలుదేఱినారు. నాటి
నుండి నేటివఱకు వేదాంతమతము మన
దేశములోనున్న జనసామాన్యమును పవిత్రమైన మునుపటి
స్థితికి నెమ్మదిగాఁ దీసికొని వచ్చుచునే యున్నది. దేశములో
పాతుకొనిపోయిన దురాచారముల నీ పురాతన సంస్కర్తలు
బాగుగా నెఱుఁగుదురు. కాని, వారు నిరసనమునకు దిగలేదు.
“మీ కున్నదంతయును తప్పు ; ఇఁక మీరు దానిని త్రోసి
వేయవలసినదే.” అని వారు చెప్పియుండలేదు. నిజమున
కెన్నఁ డావిధముగా జరుగనే జరుగదు. “మూఁడువందల
యేండ్లలో క్రైస్తవమతము ‘రోమనుగ్రీకు’ మతముల
ప్రభావమును త్రోసిపుచ్చినద”ని నా మిత్రుఁడు డాక్టరు
బారోసు (Dr. Barrows) చెప్పుచున్నాఁడని నే నీ దినమునఁ
జదివియున్నాను. ‘యూరోపు, గ్రీసు, రోము’ లను దర్శించిన
వాని మాటలు కావవి. రోమను గ్రీకు మతముల ప్రభావ

మంతయు నక్కడ నుండనేయున్నది. విశేషమేమనఁ, పేరులు మాత్రము మార్చుకొని ప్రాతదేవతలు క్రొత్తవేషములతో వచ్చుచున్నారు. వారు మార్చుకొనినవి పేరులుమాత్రమే. స్త్రీదేవతలు 'మేరీ' లగుచున్నారు; పురుషదేవతలు సాధువు లగుచున్నారు; మునుపటి యుత్సవములే క్రొత్తపేళ్లతో వచ్చుచున్నవి; 'పాన్టిఫెక్స్ మాక్సిమస్' (Pontifex Maximus) అను పూర్వపు బిరుదు నట్లేయున్నది. మత సంస్కారణములోఁ జిల్లరగఁ గాక టోకుబేరముగఁ జేయు మార్పులు నెగ్గనేరవని యిది మనకు ఋజువు చేయుచున్నది. ఈ విషయము శంకరాచార్యులకుఁ దెలియును; రామానుజులును దీనిని గ్రహించినవారే. కాఁబట్టి, యప్పుడున్న మతము నుత్తమమైన యాదర్శమునకుఁ దీసికొనిపోవుటయే వారికి మిగిలిన మార్గము. అనేకమైన గతులలో, స్థితులలోఁ బరమావధి పర్యంతము ముందునకుఁ బోవుటయను పరిణామక్రమమే వారిమతములోనున్న మూలసిద్ధాంతము కావున వారు మఱొకత్రోవ త్రొక్కఁబోయిన మోసము చేసినవారై యుండెడివారు. మఱి యీగతులు, స్థితులన్నియు నందుచే నవసరమే. అవి మనకు సాయము చేయఁగలవు. వానిని ఖండించుటకు సాహసించువా రెవరు?

'విగ్రహారాధనము తప్పు' అని చెప్పటొక యాచారమై యున్నది. ప్రస్తుతకాలమున నొక్కొక్కఁడును దాని 'నెందుచేత?' నని యడుగకయే చెవియొగ్గి వినుచున్నాఁడు. ఔను, నేను ఒకప్పుడాతీతిగనే తలఁచితిని. దానికిఁ బ్రాయశ్చిత్తముగా విగ్రహములనుండి తనకున్నదంతయు సంపాదించిన

యొక పురుషుని పాదములకడఁ గూర్చుండి నా గుణపాఠము లను నేను నేర్చుకొనవలసి వచ్చినది.—ఆ పురుషుఁడే శ్రీ రామకృష్ణ పరమహంస.

సాంకేతిక రూపమున దేవుని చిత్రించుట సహాయకరమే.

హిందువులారా! 'విగ్రహారాధనము' మూలమున నట్టి రామకృష్ణ పరమహంసలు కలుగునెడల మీ కేది కావలయును? సంస్కర్తల సిద్ధాంతమా? లేక నపారములైన విగ్రహములా? దీనికి మీరు సమాధానము చెప్పవలసి యున్నది. 'విగ్రహారాధనము' మూలమున మీరు రామకృష్ణ పరమహంసను పుట్టింపఁగలిగినచో నింకొక వేయి విగ్రహములను తీసికొనుఁడు. భగవంతుఁడు మీకుఁ దోడ్పడుఁగాక! ఏవిధముగానైనను మీ రట్టి యుదారస్వభావ సంపన్నులను కలుగఁజేయవలయును. 'వి-గ్ర-హా-రా-ధ-న-ము' ను ఖండించుచున్నారు!—ఎందుచేత? కొన్నివందల యేండ్లకుఁ బూర్వ మొకానొక యూదుఁడు (Jew) దానిని ఖండించుట తటస్థించినది గనుక.—అనఁగా నతఁడు తన విగ్రహములను విడిచి మిగిలినవారి విగ్రహముల నన్నింటిని నిరసించుట సంభవించినది. ఇంతకంటె మఱియే కారణము నెవరికిఁ దెలియదు. ఆ యూదుఁడు చెప్పిన దేమనఁగా. "అందమైన యే రూపములోనైనను, లేకనే సాంకేతిక రూపముననైనను, దేవుని రచించితిమా, అది మహాదోషము; మహాపాతకము. కాని యిరువురు దేవతలు చెరియొకప్రక్కఁ గూర్చొనియుండ మీఁదనొక మబ్బు వ్రేలాడుచున్నట్టు లొక పెట్టె రూపమున దేవుని జిత్రించిన అది పవిత్రాతి పవిత్రము! భగవంతుఁ డొక పావు

రము పిట్ట రూపముతో వేంచేసిన, అది పవిత్రమైన వానిలో నెల్ల పవిత్రమని చెప్పవలసి యున్నది! కాని, దేవుఁడు గో రూపమున వచ్చెననుకొనుఁడు; అది క్రైస్తవమత బాహ్యుల మూఢవిశ్వాసము; దానిని మీరు ఖండింపవలసినదే! ప్రపంచ మీరీతిగా నున్నది. ఇందుచేతనే కాఁబోలును, "మన మానవు లెంతటి బుద్ధిమాలినవా"రని కవి పలికినాఁడు. ఈ కారణము చేతనే ఒకరియనుభవము నింకొకరు గ్రహించుటకష్టసాధ్యము. మానవజాతి కిదియే ప్రాణాంతకమైన విషము. ద్వేషము, అసహనము, కలహము, యుద్ధము—వీని కిదియే మూల కారణము. చెన్నపట్టణమునుండి యెన్నడు నీవలకు వచ్చి యెఱుఁగని పిల్లలా,—మీసములు వచ్చిన పసికూనలా,—వేలకొలఁది సాంప్రదాయములతో వచ్చుచున్న ముప్పదిమూఁడు కోట్ల ప్రజలకు చట్టములను శాసించుటకై తగుదుమని లేచి నిలువఁబడుట! మీకు సిగ్గులేదా? అట్టి మహా పాపప్రసంగ ములకు దిగక మొదట మీ గుణపాఠములను మీరు నేర్చు కొనుఁడు. మానాభిమానములులేని ఓ పిల్లలారా! కేవలము కొన్ని పంక్తులను కాగితములమీఁద గీయనేర్చి వానిని మీకై ప్రకటించుటకే మతిమాలిన వానినో చేఁబట్టినంతమాత్ర మునఁ 'బ్రపంచమునకు మేమే బోధకుల'మనుకొనుచున్నారు! భారత దేశములోనున్న ప్రజాభిప్రాయమును దెలియఁజేయు ప్రతినిధుల మనుకొనుచున్నారు! అంతియేనా? అందుచేత మదరాసులోనున్న సంఘసంస్కర్తలతో నొకసంగతి చెప్ప వలసియున్నది. "మీయందు నా కెంతయో గౌరవము; ఎంతయో ప్రేమ,"అని. ఏలన, దేశముపై, బీదలపై, నిమ్న

జాతి జనులపై వారికిఁ బ్రేమ కలదు. కాని, వారికి నేను చెప్పునదేమన, "మీ పద్ధతి సక్రమమైనదికాదు. నూఱేండ్ల నుండి యీ పద్ధతి ప్రయత్నించి చూచినదే. ఇది నెగ్గినది కాదు. ఇప్పు డేదైన మనమొక క్రొత్తపద్ధతిని ప్రయత్నించి చూడవలయును." భారతదేశము నం దెన్నఁడైనను సంస్కర్తలకు లోపము కలిగినదా? భారతదేశచరిత్రను మీరు చదివియున్నారా? రామానుజులెవరు? శంకరులెవరు? 'నానక్' ఎవరు? చైతన్యులెవరు? 'కబీ'రెవరు? దాదూయెవరు? నక్షత్రపథమందలి తారకరాజములని చెప్పఁదగి, యొకరి తరువాత నొకరుగా వచ్చుచున్న యీ మహామత బోధకులందఱు నెవరు? అంత్యజాతులకై రామానుజుల మనసు కరఁగలేదా? తన శాఖలోనికి కడజాతి మాలవానినికూడఁ జేర్చుకొనుటకై యతఁడు ప్రయత్నింపలేదా? మహమ్మదీయులనుకూడఁ దన జాతిలోనికిఁ జేరఁదీసికొనుట కతఁడు యత్నింపలేదా? హిందువులతోడను మహమ్మదీయులతోడను సంప్రదించి 'నానక్' ఒక క్రొత్తపద్ధతి తీసికొని వచ్చుటకై కృషి చేయలేదా? వీ రందఱును ప్రయత్నించినవారే. వీరి కృషి యింకను సాగుచునే యున్నది. ఉన్న భేదమంతయు నిది; ఇప్పటి సంస్కర్తలయొక్క లేనిపోని యట్టహాసము, గడబిడ, వారి చెంత లేదు. ఆధునిక సంస్కర్తలవలె వారినోటినుండి శాపాలాపము లెన్నఁడును రాలేదు. వారి నోటినుండి దీవనలే వచ్చినవి. వా రెన్నఁడును నిరసనమునకుఁ బూనలేదు. 'మనజాతి

నిరసనము మూలమునఁగాక, ప్రేమ సానుభూతుల వలన నభివృద్ధి తీసికొని వచ్చుటయే మన మహా సంస్కర్తల విధానము.

సర్వదా వృద్ధిపొందవలెన'నియే వారు ప్రజలతోఁ జెప్పినారు. "ఓ హిందువులారా! మీ రింతవఱకుఁ జేసినది బాగుగనే యున్నది కాని మా యన్నలారా! మన మంతకంటె మంచి పని చేయుదము," అని తమ దృష్టిని వెనుకకు మఱల్చి వారు ప్రజలతోఁ జెప్పిరేకాని, "మీ రింతవరకు దుర్మార్గులై యున్నారు; కాని మన మిప్పుడు బాగుపడుద"మని చెప్పలేదు. "మీ రింత పర్యంతము మంచివారుగనే యున్నారు; కాని మన మిప్పుడు మఱింత మంచివారల మగుదము," అనియే వారు పలికినారు. దానికిని దీనికిని సముద్రమంతయంతరువున్నది. మన స్వభావము ననుసరించి మనము వృద్ధిచెందవలసియున్నది. ఇతర దేశములలోనున్న సంఘములు మనకుఁ దీసికొనివచ్చి యంటుగట్టిన కార్య పద్ధతులను ప్రయత్నించిచూచుట కేవలము వ్యర్థము. అది యెన్నఁడును సాధ్యముకాదు. ఇతరజాతుల వేషమువైచి కొనుటకై యఱఁగిమఱఁగి యమయాతనపడుట మనవలనఁ గాకుండునట్లు చేసినందులకు దేవునకు జయమగుఁగాక! అట్లని యితరజాతుల సంస్థలను నేను నిరసించుటలేదు. అవి వారికి మంచివేకాని మనకుఁగాదు. వారి కమృతమైనది మనకు విషము కావచ్చును. మనము నేర్చుకొనవలసిన మొట్టమొదటి గుణపాఠమిది. ఇతర శాస్త్రములతో, నితరసంస్థలతో, మఱి, పూర్వమునుండియు వచ్చుచున్న సాంప్రదాయములతో వారు నేఁడు తా మవలంబించుచున్న పద్ధతులకు వచ్చినారు. మన మో, మన సాంప్రదాయములతో, వేలకొలఁది యేండ్లనుండి యు వచ్చుచున్న కర్మతో, మన స్వభావమును మాత్రమే

మన మనుసరింపఁగలము. పరుగెత్తినయెడల మన కేర్పడిన కర్మరంగమునందే పరుగెత్తవలయును. ఇదియే మన విధ్యుక్తము.

ఇఁక, నా కార్యవిధానమేమన, వెనుకటి మహాప్రజ్ఞానిధుల యభిప్రాయముల ననుసరించుటయే. వారు చేసినపని నేను పరిశీలించి, వా రవలంబించిన కార్యక్రమమును కనిపెట్టినాను. వారు మహాసాంఘిక నిర్మాతలు. బలము, పవిత్రత, జీవశక్తి—వీనిని ప్రసాదించిన మహాదాతలు వారే. అత్యద్భుతమైనట్టి కార్యమును నెఱవేర్చినవారు. మనముకూడ అద్భుతమైనపని చేయవలసియున్నది. దేశకాలపరిస్థితులు మాఱుటచేత మన కార్యవిధానములను కొంచెము మార్పవలసియున్నది. అంతకంటెఁ జేయవలసిన దేమియులేదు. ప్రతి జాతికిని ప్రతి వ్యక్తికివలెనే జీవితములో నేదో ప్రధానవిషయ మొకటి, లేదా ప్రధాన స్వర మొకటి యున్నది. ఈ స్వరముతో నితర స్వరములన్నియు మేళవించి శ్రుతి సమ్మేళనమును కలిగించుచున్నవి. ఇంగ్లాండు దేశమునందువలె ఒక జాతికిఁ బ్రాణశక్తి రాజకీయ ప్రతిభ యందున్నది. మఱియొకదానికి లలితకళాజీవితమందు, నిట్లే యొక్కొక్కదాని కొక్కొక్కదాని యందును నుండును. భారతదేశములో పారమార్థికజీవితము కేంద్రస్థానము వహించి జాతీయజీవితమను సంగీతమునకుఁ బ్రధానశ్రుతియైనది. శతాబ్దములనుండి పారంపర్యముగా సహజమై వచ్చుచున్న మార్గమగు తన కేంద్రస్థానమునుండి యేజాతియైనను దిగ

పూర్వ సాంఘికమహా నిర్మాతల ననుసరించుటయే నా కార్య విధానము.

జారుటకుఁ బ్రయత్నించి, విజయముపొందినయెడల ఆజాతి నాశనమైపోవలసినదే. అందుచే మీరు మీ మతమును త్రోసి పుచ్చి, రాజకీయముగాని, సాంఘికముకాని మతేయితర మైనదానినికాని మీ జాతీయ జీవితమునకుఁ బ్రధాన కేంద్రముగా గ్రహించుటకుఁ బ్రయత్నించి యట్టి యత్నములో నెగ్గితిరేని మీరు నాశనమై పోవుటయే దానికిఁ బర్యవసానమగును. అట్టిది సంభవింపకుండుటకై యన్నిటియందును, ప్రతి విషయమందును మీరు మతముద్వారా పనిచేయవలసి యున్నది. మీ పటుత్వమంతయు, ఆ ప్రధానశ్రుతితో మేళవించి పనిచేయునట్లు చేయుఁడు. మతము మీ వెన్నెముక కావలసియున్నది. అమెరికా దేశములో సాంఘిక జీవితమునకు మతమువలనఁ బ్రత్యక్షముగాఁ గలుగు లాభము చూపింపనిదే మతబోధ చేయఁజాలనని కనిపెట్టియున్నాను. ఇంగ్లాండు దేశములో వేదాంతమువలనఁ గలుగు నాశ్చర్యకరమైన రాజకీయ పరివర్తనములను కనఁబఱుపనిదే నేను మతము బోధింపఁ జాలకుంటిని. కావున హిందూదేశములో సాంఘిక సంస్కరణమునుగూర్చి బోధించునప్పుడా క్రొత్త పద్ధతి యెంతటి యాధ్యాత్మిక జీవితమును తీసికొని రాఁగలదో చూపవలయును. రాజకీయమునుగురించి బోధించిన అది మనజాతికిఁ గావలసిన యాముష్మికము నెంతవఱకుఁ జక్కఁబఱుచునో కనఁబఱుచుట కర్తవ్యము. ప్రతిజాతియుఁ బ్రతి వ్యక్తివలెనే తన కిష్టమైనదాని నెన్నుకొనుచుండును. మనకుఁ

మనసాంఘిక జీవిత రహస్యమైన మతముద్వారా హిందూదేశములోఁ బరివర్తనముకలుగవలసి యున్నది.

గావలసిన దానిని యుగములకు ముందే మన మెన్నుకొని యున్నాము. మనము దానికిఁకఁ గట్టువడియుండవలసినదే. ఇంతకును అదియంత చెడ్డయెన్నిక కానే కాదు. జడమునుగురించికాక చైతన్యమును గూర్చియు మనుష్యునిగురించికాక భగవంతునిగురించియుఁ దలఁచుట యీ ప్రపంచములో నంత చెడిపోయిన యెన్నికయా? పరలోకమునందలి గాఢమైన యీవిశ్వాసము, ఈ లోకమునందున్న గాఢమైన యీ అసహ్యము, గాఢమైన యీ వైరాగ్యశక్తి, దేవునియందు గాఢమైన యీ నమ్మకము, శాశ్వతమైనట్టి ఆత్మయందు గాఢమైన యీ విశ్వాసము—శతాబ్దములనుండి పరంపరగా వచ్చుచు మీలోనున్నవి. వీని నెవ్వఁడైనను విడిచివేయఁగలిగెనేని నేను సవాలు (Challenge) చేయుచున్నాను. అది మీ చేతగానిపని. మీరు నాస్తికులై కొన్ని నెలలపాటు నాస్తికవాదము చేయుచు నామీఁదకు రావచ్చును. కాని, సహజముగా మీరెవ్వరో నే నెఱుఁగుదును. ఆధ్యాత్మిక జీవితము మీయెదుటఁ బడఁగానే మీరు శుద్ధాస్తికులైపోవుదురు. మీనైజమును మీరెట్లు మార్చుకోఁగలరు?

సంస్కరణము లన్నిటికంటె ముందు కావలసినది ఉపనిషత్తులలో నున్న సత్యముల యొక్క వ్యాప్తి.

కావున, హిందూదేశములో నేయభివృద్ధికైనను మొట్టమొదటఁ గావలసినది మతోద్ధారణము. దేశమును సాంఘికమైన, లేదా, రాజకీయమైన భావములతో నిండింపవలెనన్న, ఆధ్యాత్మికోద్దేశములతో దేశము పొర్లిపాఱునట్లు చేయవలయును. మొట్టమొదటఁ జేయవలసినపనియది. వేదములయందుఁ

పురాణములయందు నిమిడియున్న ఆశ్చర్యకరమైన సత్యములను, అద్భుతమైన సత్యములను, ఏవో కొన్ని యెన్నికఁగన్న జనసమూహముల యాధీనమునుండి యీవలకు లాగుకొనివచ్చి, ఉత్తరమునుండి దక్షిణమువఱకును, తూర్పునుండి పడమటివఱకును, హిమాలయపర్వతములనుండి కన్యాకుమారి అగ్రమువఱకును, సింధునదినుండి బ్రహ్మపుత్రానదివఱకును, దేశమందంతటను వ్యాపించునట్లు చేయవలసియున్నది. "మొదట దీనిని గురించి వినవలయును; తరువాతఁ జింతన చేయవలయును; అప్పుడు ధ్యానము చేయవలయును." * అని చెప్పియుండుటచేఁ బ్రతి మనుష్యుఁడును వానిని గూర్చి తెలిసికొని తీరవలసినదే. జనులను మొదట దానిని విననిండు. మన వేదములలో నిమిడియున్న ఘన సత్యములను జనులు వినునట్లు చేయుటలో నెవరు తోడ్పడుదురో అట్టివారు సాటిలేని పుణ్యముచేసినవా రగుదురు. ఇతర యుగములందువలె యజ్ఞయాగములవలనను, ఘోరతపములవలనను నిప్పుడు ప్రయోజనము లేకపోవుటచే, ఈ కలియుగమునందు మనుష్యుఁడు సంపూర్ణుఁడగుట కిది యొక్కటే మిగిలియున్న కర్మమని మనువు చెప్పుచున్నాఁడు. † ఈ కర్మమే దానము. మఱి, దానము లన్నిటియందు నాధ్యాత్మికదానమే యుత్తమదానము; దాని తరువాతిది విద్యాదానము. ప్రాణ

---

* శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః.

† శ్లో. తపఃపరం కృతయుగే, త్రేతాయామ్ జ్ఞానముచ్యతే,
ద్వాపరే యజ్ఞమేవాహుః దానమేకమ్ కలౌయుగే.

మనుస్మృ, ౧౮౬

దానము దాని తరువాత వచ్చునది. నాల్గవది యన్నదానము.

దానమును విధ్యుక్తకర్తవ్యమే ఈ యుగమున మనువు మనకు విధించినది.

మను విట్లు చెప్పియున్నాఁడు. ఈ దేశములో జను లింకను దానికిఁ గట్టువడి యున్నారు. ఆశ్చర్యకరమైన దానధర్మములతోఁ గూడిన యీజాతిని చూచుఁడు. ఈ బీద దేశములో, ఈ నిరుపేద దేశములోఁ జేయుచున్న దానములను చూడుఁడు. తన యాప్తస్నేహితుల మధ్య నున్నవిధముగా నుత్తమోత్తమమైన వస్తువులను ప్రజలనుండి గైకొనుచు నే మార్గస్థుఁడైన నుత్తరమునుండి దక్షిణమువఱకుఁ బ్రయాణము చేయుట కనువైనట్టి, యే మూలనైనను పిడికెడన్నపు మెతుకు లున్నంత పర్యంత మే బిచ్చగానికిని పస్తుపడి యుండవలసిన యవసరము లేనట్టి యీ భారతదేశములోనున్న యాదరణమును చూడుఁడు.

ఈ దానము లన్నిటియందు నుత్తమమైన జ్ఞానదాన వ్యాప్తిని గూర్చి కొన్నిమాటలు చెప్పెదను. ఈ వ్యాపన మొక హిందూదేశపు సరిహద్దులయందే యిమిడిపోఁగూడదు. ఇది హిందూదేశమును దాఁటి ప్రపంచమందంతట నల్లుకొనవలసినదే. ఆచారము నిట్లేయున్నది. భారతీయ విజ్ఞానము (Indian thought) 'హిందూదేశమునుదాఁటి యెన్నడును బైటికిఁ బోలేదని చెప్పువారికిని, మతబోధకై యన్యదేశములకుఁ బోయినవారిలో నేనే మొట్టమొదటి సన్యాసిన' ని చెప్పువారికిని తమజాతి చరిత్రయే తెలియదు. చాలసారు లిట్లు జరిగినది.

ఆధ్యాత్మిక జ్ఞానమును విరజిమ్ముటయే హిందూదేశము ప్రపంచమున కీయవలసిన సందేశము.

లోకమునందు మతము కావలసివచ్చినప్పుడెల్ల, నిరంతరము నెడతెగక పాఱుచున్న వేదాంతమను ప్రవాహము భారత దేశమునుండి పొంగి పొరలి ప్రపంచమునంతను ముంచియెత్తినది. ఘోరయుద్ధములు చేయనిదే రాజ్యాంగ సంస్కరణ ప్రదానము లెన్నడును జరిగినదిలేదు. లౌకిక విద్యాప్రదానములను, నూతన సంఘసంస్కరణ ప్రదానములను చేసినప్పుడు కొన్ని సమయములలో ఫిరంగులను, కత్తులను ఉపయోగింపవలసి వచ్చినది. కాని, జ్ఞానదానములను మాత్ర మీ యార్భాటము లేమియు నవసరము లేకుండగనే చల్లగా చప్పుడు లేకనే చేయఁగలము. కనఁబడకుండఁగను, వినఁబడకుండఁగను క్రిందఁబడుచు గులాబిమొగ్గల గుత్తులను వికసించునట్లు చేయు మంచువంటిది జ్ఞానదానము. భారతదేశము మాటిమాటికిఁ బ్రపంచమునకుఁ జేసిన దాన మిట్టిది. ప్రపంచములోనున్న జాతులమధ్య రాకపోకలు కల్గించి, దానిమూలమున వాని నొక్కటిగాఁ జేరఁదీయుచు నెప్పుడెప్పుడు విస్తారముగా జయించుచున్న జాతి యొకటి బయలుదేఱునో అప్పుడెల్ల, భారతదేశము వెంటనే లేచి తన జ్ఞానదానములను చేయుచు మొత్తముమీఁద ప్రపంచములోనున్న యభివృద్ధికిఁ దోడ్పడుచు వచ్చినది. బుద్ధుఁడు పుట్టుట కనేక యుగములు ముందును వెనుకను కూడ నీ విధముగా జరిగినది. దాని సంబంధమైన జాడ లింకను చైనా, ఆసియామైనరు, (Asia Minor) మలయదేశపు ఆర్చిపిలగో (Malayan Archipilago) లందు మిగిలియున్నవి. గ్రీకు మహావీరుఁ డాకాలమునాఁటికిఁ దెలిసిన ప్రపంచము నాల్గుమూలల నేకముచేసినపు డిట్లే సంభవించి

నది. ఆకాలమున భారతీయాధ్యాత్మిక జ్ఞానమానఁటి ప్రపంచ మును ముంచియెత్తినది. మఱి, మన మెంతయో గొప్పగాఁ జెప్పుకొను పాశ్చాత్యనాగరకత యావరదలోని యొక నీటి బొట్టు. ఇప్పు డట్టి యవకాశమే వచ్చినది. ఆంగ్లేయుల శక్తి యిదివఱ కెన్నఁడును లేనివిధమునఁ బ్రపంచజాతులనొక్క గొలుసుగా గ్రుచ్చినది. ప్రపంచములో ఈ చివరనుండి యా చివరవఱకును ఇంగ్లాండుదేశపు బాటలును రాకపోకల దారులును వ్యాపించియున్నవి. ఇంతకుముం దెన్నఁడును జరుగని విధమునఁ బాశ్చాత్యుల ప్రతిభచే నేఁడు ప్రపంచ మొక్క గొలుసుగా గ్రుచ్చఁబడియున్నది. మానవజాతి చరిత్రమునం దింతకుఁ బూర్వమున లేని రీతిని నేఁడు వాణిజ్య మునకుఁ బ్రధానములైన కేంద్రస్థానము లేర్పడియున్నవి. మఱి, తత్క్షణమే తెలిసియో తెలియకో భారతదేశము తన జ్ఞానదానములను ధారాపాతముగఁ గురిపించుచున్నది. ఇఁక నివి ప్రపంచపు టంచులను చేరు పర్యంత మీ దారులఁబట్టి పరుగు పరుగునఁ బోవలసియున్నది. నే నమెరికా వెళ్లినా ననఁగా, అది నేను చేసినపని కాదు ; మీరు చేసినపని యంత కంటెఁ గాదు. కాని, భారతదేశమును దానివిధి ననుసరించి నడిపించుచున్న యా భగవంతుఁడు చేసిన పనియది. భగవం తుఁడే నన్ను నడిపించినాఁడు. మఱి, ప్రపంచమునందలి సమస్తజాతులకును నావంటి వారిని వందల తరబడి నతఁడే పంపఁగలడు. ఈ లోకములోనున్న మరేశక్తియు దాని నాపఁజాలదు. అందువలన నిది జరుగవలసియున్నది. మీ మతమును బోధించుటకు మీరు విదేశములకుఁ బోవలసి

యున్నది. భూగోళములో నున్న ప్రతిజాతికిని ప్రతిజనునకును మీరు మీ మతమును బోధింపవలసినదే. మఱి, యాధ్యాత్మిక జ్ఞానబోధతోఁ గావలసిన లౌకికజ్ఞానముఁ దదితర జ్ఞానము సైతము రాఁగలదు. కాని, మతము వినా మీరు లౌకికజ్ఞానము సంపాదింపఁదలచి ప్రయత్నించినయెడల—నేను దాపరికములేక స్పష్టముగఁ జెప్పుచున్నాను—మీ యత్నము నిష్ఫలము; దానివలన లేశమైనను లాభములేదు. హిందూదేశపు జనుల కది యెన్నడు తలకెక్కదు. కొంతవఱకీకారణముచేతనే బౌద్ధుల మహోద్యమమునకు సైతము ప్రయోజనము లేకపోయినది. కాబట్టి నా మిత్రులారా! భారతదేశము లోపలను వెలుపలను కూడ మన వేదములలోనున్న సత్యములను బోధించునట్లు చేయుటకై యువకుల కట్టి శిక్షణఁ గఱపుటకు భారతదేశములో సంస్థలను నెలకొల్పుటయే నా కార్యవిధానము.

ఈ విధ్యుక్తమైన కర్మము నెఱవేర్చుటకుఁ గావలసియున్న వారుపురుషులు

ఏమిజరిగినను సరియే, తాము తలపెట్టిన కార్యము విడువని పూనికఁగలిగినవారు, పటుత్వముతోఁబాటు విశ్వాసము కలిగిన యువకులు కావలసియున్నారు. మిగిలినదంతయు దాని యంతటదియే సిద్ధముకాఁగలదు. అట్టివారొక వందమంది లభించినయెడల ప్రపంచమునకుఁ బ్రపంచమే పరివర్తనము కాఁగలదు. అట్టివారి సంకల్పముకంటె బలవత్తరమైనది లేదు. దానిముందేదియు నిలువఁజాలదు. స్వచ్ఛమై, దృఢమైన సంకల్పము సర్వశక్తిమంతమైనది. అది సాక్షాద్భగవంతునియొద్దనుండి వచ్చునది.

ఇఁక మీరు మీమతములోనున్న మహత్తర సత్యములను మీ దేశీయులకు బోధచేయుఁడు. ప్రపంచము వానికొఱకై కనిపెట్టుకొనియున్నది. శతాబ్దములు వెంబడి నధఃపతన కారణములైన సిద్ధాంతములను జనులు నేర్చుకొనియున్నారు. తాము మానవమాత్రులము కామని ప్రపంచమందంతటను చెప్పఁగా వారు వినియున్నారు. కొంచెము మించుమించుగా పశువులైపోవు పర్యంతమును శతాబ్దములనుండి జనుల నట్లు భయపెట్టినారు. ఆత్మనుగూర్చి వారి నెప్పుడు విననీయనైన లేదు. ఆత్మనుగురించి — ఏది యధమాధములలోఁగూడ నున్నదో, ఏది యెన్నఁడును పుట్టనిదో, యెన్నఁడును చావనిదో, దేనిని కత్తులు నఱుకలేవో, నిప్పు కాల్పలేదో, గాలి యెండింపలేదో, ఎయ్యది తుదమొదలు లేనిదో, యెల్లకాలము నుండెడిదో, యేది మచ్చలేనిదో, ఎయ్యది సమస్త శక్తులతో నన్నితావులందు నున్నదో, అట్టి యాత్మనుగూర్చి వారిని విననిండు.

మన శక్తులను ప్రదర్శించు నింద్రజాలకులలోఁ గాక తమయందు దృఢవిశ్వాసము కలిగినపురుషులు కావలసియున్నారు.

ఆత్మనుగురించి బోధించుటకుఁ దోడు మీయందు మీరు నమ్మకము కలిగియుండుఁడు. ఆంగ్లేయులకును మీకును భేద మెందులోనున్నది? మతము, విధ్యుక్త ధర్మము మొదలైన వానిని గూర్చి యాంగ్లేయుఁడు మాటలాడిన మాటలాడుఁ గాక! కాని, తారతమ్య మెందులోనున్నదో నేను కనిపెట్టినాను. ఉన్న యంతరమిది. 'ఇంగ్లీషు' వానికిఁ దనయందుఁ దనకు నమ్మకమున్నది; మఱి, మీ కదిలేదు. తా నాంగ్లేయుఁ డనని, తా నేపనినైనఁ జేయఁగలనని యతనికి విశ్వాసము

కలదు. అదియే వానిలోనున్న దైవశక్తిని బైటికిఁదీసికొని వచ్చుచున్నది. తన యిష్టము వచ్చినపని నాతఁడు చేయఁగలుగుచున్నాఁడు, మీరన్ననో, "మీరు చేయఁగలిగిన దేమియు లేద"ని మీకుఁ జెప్పినారు, నేర్పినారు. అందు వలననే మీ రొకనాఁటి కొకనాఁడు 'మే మీపనిచేయఁగలమ'ను నమ్మకము లేని ఉత్సవవిగ్రహములగు వ్యక్తిశూన్యులై పోవుచున్నారు. కావున ఆత్మవిశ్వాసము కలిగియుండుఁడు. మనకుఁ గావలసినది బలము. మనము దుర్బలులమై పోవుట చేతనే మనశ్శక్తులఁ బ్రదర్శించు నింద్రజాలము (Occultism) మొదలైన చిల్లరవిషయములు మనకడకు వచ్చుచున్నవి. ఆ విద్యలలో ఘన సత్యములుండిన నుండుఁగాక! కాని, యవి మనల నించుమించుఁగా నాశనముచేసి యెందులకుఁ బనికిరాని భ్రష్టులను చేసినవి. మీ నరములకు బలముఁ గూర్చుకొనుఁడు. మనకుఁ గావలసినవి యినుపకండలు; ఉక్కునరములు. మన మింతకాలము వఱ కేడ్చినది చాలును; ఇఁక నేడుపు చాలించి మీ పిక్కలపై నిలువఁబడుఁడు. పౌరుషశాలురు కండు. మనకుఁ గావలసినది మనుష్యులను చేయఁగల మతము; మానవులను చేయఁగల సిద్ధాంతములే మనకుఁ గావలసినవి. సర్వతోముఖముగా మనుష్యులను చేయఁగలిగిన విద్యయే మనకుఁ గావలసినది.

జ్ఞానబల నైర్మల్యములను తీసికొనిరాఁగల్గినది సత్యమే.

ఇదిగో, సత్యమును పరీక్షించు సానఱాయి యిక్కడనే యున్నది. శరీరమునందుఁగాని, బుద్ధియందుఁగాని, ఆధ్యాత్మిక జ్ఞానసంపదయందుఁగాని మీ కేది నీరసముఁ గలిగించినను దానిని విషతుల్యముగ విడిచిపెట్టుఁడు. దానిలోఁ

ప్రాణము లేదు. అది నిజ మెన్నటికిని కానేరదు. సత్యమే మనకు బలము కలిగించునది. సత్యమే స్వచ్ఛత; సత్యమే జ్ఞానము. సత్యమే పుష్టిని, జ్ఞానమును ఉత్సాహమును కలిగింప వలసి యున్నది. ఈ యింద్రజాల విద్యలో లేశమాత్రము నిజమున్నను సర్వసాధారణముగా అది నీరసత్వమునే కలిగించును. నామాటలను నమ్ముఁడు. ఆ విషయములో నాకు జన్మమంతయు ననుభవమే. భారతదేశములోఁ బ్రతి ప్రదేశమునకును ప్రయాణముచేసియున్నాను; అనేక గుహాలను వెదకినాను; హిమాలయ పర్వతములలోఁ గొంతకాల మున్నాను; జన్మమంతయు ఆ హిమాలయములలోఁ గడపిన మనుష్యులను నే నెఱుఁగుదును. సారాంశమేమన, అట్టివి దౌర్బల్యము కలిగించునవి.

నా జాతిని నేఁ బ్రేమింతును. ఇప్పటికే బలహీనులై యున్న మీ రింకను బలహీనులై క్షీణించిపోవుచుండఁగా నేను చూడఁజాలను. అందుచే మిమ్ములను, ' సత్యమును, చూచి, నా జాతి యీ విధముగా క్షీణించి పోకుండ, "ఆగుఁడు ఇంతటితోఁ జాలును," అని గొంతెత్తి బిగ్గఱగా నఱచుటయే నావిధి. మీ రిప్పుడున్న చోటనే యాగుఁడు; బలవంతులు కండు; ప్రకాశమానమై, బలకారణమై యున్నతమై యొప్పు నట్టి యుపనిషద్వేదాంతము వైపునకు మఱలుఁడు. దుర్బల కారణములైన యీ యింద్రజాలపు వస్తువులను విడిచిపెట్టి వేదాంతమును దీనియందలి సరళమైన సత్యములను చేఁబట్టుఁడు. నా మాటలను నమ్ముఁడు. మీ రిప్పు డిక్కడనుండు కెంత చిన్న సంగతియో ప్రపంచములోనున్న మహా సత్యములు

కేవల మంత చిన్న సంగతులు. ఉపనిషత్తులలోనున్న యీ సత్యములు మీ యెదుటనే యున్నవి. వీనిని గ్రహించి యాచరించి మీరు పనిచేసినయెడల హిందూదేశమునకు మోక్షము చేకూరును.

నిజమైన దేశభక్తుఁడగుటకుఁ గావలసిన మూఁడు వస్తువులు.

ఇంక నొక్కమాటతో ముగించుచున్నాను. వా రేదియో దేశభక్తినిగురించి మాట్లాడెదరు. దేశభక్తియందు నాకు నమ్మకమే. దేశభక్తినిగూర్చి నాకు నా యాదర్శముకూడఁ గలదు. మహాకార్యములను సాధించుటకు మూఁడు విషయము లవసరము. మొట్టమొదట మీ మనసు కరఁగవలసియున్నది. తెలివితేటలలోఁ, దర్కించుటలో, నేమున్నది? కొన్నియడుగుల దూరము వఱకుఁ బోయి తర్క మక్కడ నాగిపోవలసినదే. దివ్యప్రేరణ (Inspiration) మనసునుండి బయలుదేఱు నట్టిది. మఱి దేనికిని సాధ్యముకాని తలుపులను తెఱచునది ప్రేమ. లోకములోనున్న రహస్యము లన్నిటికిని ప్రేమయే ద్వారము.

(1) గాఢమై అగాధమైన ప్రేమ.

కావున ఓ భావి సంస్కర్తలారా! ఓ భావి దేశభక్తులారా! మీమనసు కరఁగింపుఁడు. నిజముగా మీకు మనసు కరఁగినదా? దేవతల సంతతిలోనివారు, ఋషీశ్వరుల సంతతిలోనివారు, లక్షోపలక్షులు, కోటానకోట్లు, పశువుల కిరుగుపొరుగువారైరని మీకు సంతాపము కలిగినదా? ఈనాఁడు కోట్లకొలఁది మనుష్యులు తినుటకు లేక మలమల మాడుచున్నారని మీకుఁ గనికరము కలిగినదా? యుగముల తరబడిని కోటాన

కోట్లు పస్తుపడియున్నారని మీకు జాలికలిగినదా? అజ్ఞానము దేశమందంతట నల్లని మబ్బువలె నావరించుకొని యున్నదని మీ కనుతాపము కల్గినదా? అది మీ కేమియుఁ దోఁపనీయ కున్నదా? మీ నెత్తురు లోనికిఁబోయి నరములను చొరుచు కొని మీ గుండెలతోఁ గలసి కొట్టుకొనుచున్నదా? ఇంచు మించుగా మీకది మతిపోవునట్లు చేసినదా? బాధ, నాశ నము వీనిని గూర్చిన తలంపొక్కటియే మిమ్ముల నావరించు కొని యున్నదా? మీ పేరు ప్రఖ్యాతులను గూర్చి, మీ యాలుబిడ్డలనుగూర్చి, వస్తు వాహనములను గూర్చి, తుదకు మీ శరీరములనుగూర్చి పూర్తిగ మఱచినారా? మీ రీరీతిగాఁ జేసియున్నారా? దేశభక్తుఁడగుట కిదియే మొదటిమెట్టు; మొట్టమొదటి మెట్టు. మీలోఁ జాలమందికిఁ దెలిసినదే యీ సంగతి. నే నమెరికావెళ్లినది మత మహాసభ నిమిత్తము కాదు. జాలియనునట్టి యీ దయ్యము నాలో, నా యాత్మలో నావేశించి యుండుటచేఁ బండ్రెండేండ్ల పర్యంతము నేను హిందూదేశమంతయుఁ దిరిగితిని. పనిచేయవలసిన పద్ధతి యే దియుఁ గనఁబడలేదు. అందుచేతనే అమెరికా వెళ్లినదికూడ. అప్పుడు నన్నెఱిఁగిన చాలమంది కీవిషయము తెలిసినదే. మత మహాసభనుగూర్చి యెవరికిఁ గావలయును? ఆనాఁటి కానాఁడు నా నెత్తురు, కండలు జీర్ణించిపోవుచుండఁగా అది యెవరికిఁ గావలయును?

మీకు మనసు కరఁగినదనుకొందము. ఐతే, వట్టి నోటి దబాయింపులతో మీశక్తి సామర్థ్యములను దుర్వినియోగము చేయక, దీని కేదైన తరణోపాయమును, పనిచేయగలిగిన

పద్ధతిని, నిరసనమునకు బదులు తోడుపడఁ గలిగిన త్రోవను, జనులను వారి యిబ్బందులనుగూర్చి యోదార్చి, యీ జీవచ్ఛవస్థితినుండి పైకిఁదీసికొని రాఁదగిన చల్లని మాటలను కనిపెట్టినారా ? ఐన నంతటితో సరికాదు. కొండంతటి యాటంకములు వచ్చినను వానిని దాటఁగలిగిన దృఢసంకల్పము మీకున్నదా ? కత్తి చేఁబూని ప్రపంచమంతయు మీ కెదురైనిలచినను న్యాయమని మీరు తలఁచినదానిని చేసి తీరఁగలిగిన ధైర్యము మీకున్నదా ? మీ యాలుబిడ్డలు మీకు వ్యతిరేకముగా నున్నను, మీపేరు మాసిపోయినను, మీ సిరి సంపదలు నాశనమైనను, మీ కార్యము నంటిపట్టుకొని విడిచిపెట్టరుకదా ?

(2) వెట్టి పట్టుదల లేకపోవుట.

"నీతి నిపుణులైనవారు నిందింతురు గాక, మెత్తురుగాక ; సిరి నీకడకే వచ్చుఁగాక ; లేక తనయిచ్చ వచ్చినచోటికిఁ బోవుఁగాక; మరణము నేఁడే వచ్చుఁగాక, లేక కొన్ని యుగముల తరువాత వచ్చుఁగాక ! ధీరుఁడైనవాఁడుమాత్రము తాఁ బూనిన న్యాయమార్గమును విడిచి ఒక్కయడుగైన నీవలఁబెట్టడు," * అని భర్తృహరి మహా

(3) దృఢ సంకల్పము ; నిశ్చలమైన కృషి.

---

* శ్లో. నిన్దన్తు నీతినిపుణా యదివా స్తువంతు,
లక్ష్మీః సమావిశతు గచ్ఛతువా యథేష్టమ్
అద్యైవవా మరణ మస్తు యుగా న్తరేవా,
న్యాయ్యాత్పథః ప్రవిచలంతి పదం నధీరాః.
(భర్తృహరి సుభాషితము-నీతిశతకము-ధైర్యపద్ధతి-శ్లో. 4)

రాజు చెప్పినట్లు, యేమి జరిగినను, పట్టినపట్టు విడువక మీ గమ్యస్థానము చేరు పర్యంతము, మీ కార్యము తుద నెగ్గు వఱకు మీరు విడువరుకదా? మీ కట్టి పట్టుదల యున్నదా? ఇవి మీయొద్దనున్నఁ జాలును; ఒక్కొక్కఁ డద్భుతములను చేయఁగలఁడు. వార్తాపత్రికలలో మీరు వ్రాయ నక్కఱ లేదు; ఉపన్యాసము లిచ్చుచు నూరూర సంచారము చేయ నవసరములేదు. అప్పుడు మీలో నొక నూతనమైన కళ బయలుదేఱి, మీ రొక గుహలోఁ గాపురము చేయుచున్నను మీ యూహలు ఱాతిగోడలను బ్రద్దలుకొట్టుకొని, యే పురుషుని తలయందో ప్రవేశించి యచ్చటఁ గార్యరూపముగఁ బరిణమించు పర్యంత మవి శతాబ్దముల వెంబడిని ప్రపంచమంతటను వ్యాపించిన వ్యాపింపవచ్చును. భావము, నిష్కాపట్యము, కార్యనైర్మల్యము వీని ప్రభావ మిట్టిది.

మనజాతి కిప్పటి కంటె విశేషమైన బలము కలిగించుట, లేనియెడల నట్టి ప్రయత్నములోఁ జనిపోవుటయే మన విధి; అంతియేకాని నిరసించుట మాత్రము కాదు.

ఇఁక నొక్కమాట. మీ కాలస్యము చేయుచున్నానేమో యని నా భయము. నా దేశీయులార! నా స్నేహితులార! నా బిడ్డలార! జాతీయత యనునట్టి యీ యోడ జీవితమను సముద్రమునుండి కోటానకోట్ల జనుల నింతవఱకు దాఁటించుచునేయున్నది. శతాబ్దములనుండి పనిచేయుచున్న యీ యోడమీఁదుగ, కోట్లకొలఁది జనులు 'హాయిగ' తరించి, జీవితమను సముద్రమున కవ్వలనున్న బ్రహ్మానందమును పొందినారు. కాని యీనాఁడు మీ తప్పు వలననే కావచ్చును—ఈనావ కొక చిల్లు

వడి కొంచెము పాడైనది. అంతమాత్రమున దానిని మీరు నిందింపవచ్చునా? ప్రపంచములో నన్నిటికంటె నెక్కువ పని చేసినదానిని, లేచి నిలువఁబడి దూషించుట మీకుఁదగునా? జాతీయత యనునట్టి యీ నౌకకుఁ గన్నము లున్న యెడల, దాని పిల్లలము కావున మనముపోయి వానిని పూడ్చుదము. మన గుండెల నెత్తురు ధారపోసియైన నానందముగా మనము పని చేయుదము. సాధ్యముకానిచోఁ జనిపోవుదము. మన జాతిని నిరసించుట మాని దానిని బాగుచేసికొనుటకై మన మంద ఱము కలసి యాలోచన చేయుదము. ఈ సంఘమును నిరసిం చుచు నొక్క మాటనైనను మీరు చెప్పవలదు. ముందున్న గొప్పతనమునకై నాకీ సంఘమునందు ప్రేమ. దేవతల సం తానమును మహనీయులైన పితృదేవతల సంతానమును కావున మీ యందఱియందును నాకుఁ బ్రేమయే. మీకివే యాశీర్వచనములు! మీపై శాపములఁ బెట్టుదునా? కలలో నైన నే నాపనిమాత్రము చేయను. నాబిడ్డలార! నా యుపా యముల నన్నిటిని మీతోఁ జెప్పుటకై మీకడకు వచ్చి యున్నాను. మీ రవి వింటిరేని మీతోఁ గలసి పనిచేయుటకు నేను సంసిద్ధుఁడను. నామాటలనువినక, హిందూదేశమునుండి యవ్వలఁ బడునట్లు నన్ను మీరు తన్నినను సరియే నేను తిరిగి వచ్చి, "మన మందఱమును మునిగి పోవుచున్నాము. నే నిప్పుడు మీతోడనే యుండుటకు వచ్చియున్నాను. మునుఁగి పోవునెడల మన మందఱమును కలసి మునుఁగిపోవుదము.

అంతియేకాని శాపములుమాత్ర మెన్నఁడును మన నోటినుండి రాకుండుఁగాక,'' అని మీతో నేను చెప్పక మానను.

శ్రీ రామకృష్ణార్పణమస్తు!

ఓం తత్సత్.



కేసరీ ముద్రాక్షరశాల, చెన్నపురి.

## శ్రీ రామకృష్ణ మఠమువారి

# తెలుగు గ్రంథములు

శ్రీ రామకృష్ణ లీలామృతము—(శ్రీ రామకృష్ణుని జీవిత చరిత్ర)—గాంధిమహాత్ముని తొలి పలుకుతో కాలక్రమానుసారముగా వర్ణింపఁబడిన మహాప్రభుని అద్భుత జీవితచరిత్ర. తేటతెలుగు మాటలతో తాంత్రిక, వైష్ణవ, వేదాంత సంబంధమైనట్టియు, ఇతర మత సంబంధమైనట్టియు శ్రీ రామకృష్ణుని వివిధ సాధనలనుగూర్చి వివరముగా తెలుపుచున్న సమగ్రమైన గ్రంథరాజము.

ఒక త్రైవర్ణ చిత్రముతోడను అనేకమైన యితర చిత్రపటములతోడను విరాజిల్లుచున్నది. 878 పుటలు.

కాలికో బైన్డ్ వెల రూ॥ 5-0-0

శ్రీ రామకృష్ణ వచనామృతము—ప్రథమ సంపుటము. సర్వజన రంజకమైన దృష్టాంతములతో ఆధ్యాత్మిక సత్యములను బోధించుచు శ్రీవారుచేసిన సంభాషణములను, ఆయా రంగములను కంటికిఁ గట్టినట్లు వర్ణించుచున్నది. వెల రూ॥. 1-8-0

శ్రీ రామకృష్ణ వాక్యావళి—(సూక్తి ముక్తావళి)-ఉత్తమ మానసిక స్థితులయందు శ్రీ పరమహంస ముఖమునుండి వెలువడిన మహోపదేశములు మొత్తముమీఁద 1003 ఇందుగలవు.

వెల రూ॥. 1-8-0

## శ్రీ స్వామి వివేకానంద ప్రవచనములు

రాజయోగము—ప్రాణ స్వరూపము, ప్రాణాయామము మున్నగు విషయములు విశదీకరింపఁబడి యున్నవి. పాతంజలి యోగ సూత్రములకు ఆంధ్రానువాదమును వ్యాఖ్యానమును గలవు.

వెల రూ॥. 1-4-0

కర్మయోగము—కర్మయోగమునందలి రహస్యమును ఈశ్వర సాక్షాత్కారమున కదియెట్లు ఉపకరించుననువిషయమును చక్కఁగ తెలుపఁబడియున్నవి. వెల రూ॥. 0-12-0

"షికాగో ఉపన్యాసములు"—శ్రీ వివేకానందస్వామి అమెరికా ఖండమునందలి షికాగో నగరమున జరిగిన సర్వమత మహా సభయందు గావించిన మహోపన్యాసములు. వెల రూ. 0-6-0

## ఇతర గ్రంథములు :—

శ్రీ వివేకానంద స్వామి జీవిత చరిత్రమును ఉపదేశములును— శ్రీ స్వామివారి సంక్షేప జీవిత చరిత్రమును, వారి ఉపదేశములందలి ముఖ్యమైన అంశములును ఇందు గలవు. వెల రూ. 0-6-0

గురూపదేశములు—శ్రీస్వామి బ్రహ్మానంద విరచితము. శ్రీ పరమహంస ఉపదేశములలో అమూల్య రత్నములని చెప్పఁదగినవి. ఇందేర్చి కూర్చఁబడినవి. సర్వవేదాంత సార సంగ్రహము.

వెల రూ. 0-6-0.

నారద భక్తి సూత్రములు— వెల రూ. 0-4-0

ముక్తిమార్గము—శ్రీరామకృష్ణానందస్వామి విరచితము.

వెల రూ. 0-2-0

ఇంకను శ్రీరామకృష్ణ శిష్యబృందమునకు చెందిన అనేక ఆంగ్ల గ్రంథములును, తమిళ కన్నడ గ్రంథములును, మాతృదేవి, శ్రీరామకృష్ణ వివేకా నందాదుల ఛాయా చిత్రములును చిత్రపటములును, త్రివర్ణ చిత్రములును (Photoes, Pictures and tri-coloured portraits) మావద్దకలవు. వివరములకు ఈక్రింది చిరునామా (అడ్రసు) కు వ్రాయవలయును.

మేనేజరు, ప్రకటనశాఖ,

శ్రీ రామకృష్ణ మఠము

బ్రాడీస్ రోడ్డు, మైలాపూర్,

మద్రాసు.